# ఆదిమ నివాసులు

గ్రంథకర్త:

**దేవులపల్లి రామానుజరావు**

ప్రకాశకులు:

జనార్దన పబ్లికేషన్సు

పుతలీబౌలి, హైదరాబాదు - ద.

వెల: **0-7-0.**

# ఆదిమ నివాసులు

ఈ ప్రపంచము మిక్కిలి విశాలమైనది, అందు అయిదు గొప్ప భూఖండములు గలవు. ఆసియా, యూరోపు, అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా అను నామములతో ఈ భూఖండములు పిలువబడుచున్నవి. మనము నివసించు భారత దేశము ఆసియా ఖండమునందలి యొక భాగము మాత్రమే. మన పురాణాదులయందు పేర్కొనబడిన అంగ వంగ కళింగ కాశ్మీరాది యేబదియారు దేశములు భారత దేశమునందలి వివిధ ప్రాంతములు.

ఒకమారు మనమీ అయిదు ఖండములందలి పరిస్థితులను సవిమర్శముగా ఆలోచించినచో అందు ఎన్నియో తెగలకు జెందిన జాతులు నివసించుచున్నట్లు తెలియగలదు. ఈ ప్రదేశమునందలి శీతోష్ణ పరిస్థితులుగూడ భిన్నముగా నుండును. ఈ పరిస్థితుల ననుసరించి అచ్చట నివసించు జనుల యొక్క రంగునందును, రూపమునందును, ఆచార వ్యవహారములందును, ఆహార విహారములందును వైవిధ్యము కనుపించుచున్నది. అందు కొన్ని వింత ఆచారములు, పద్ధతులుకూడ గోచరించుచున్నవి. ఈ వింతపద్ధతులే ఆయా జాతుల యొక్క సంస్కృతి విశేషమనికూడ మనము చెప్పవచ్చును.

# ఆది మానవుడు

మానవ నాగరికతయొక్క చారిత్రక పరిణామమును మనము పరిశీలించినచో మానవుడు ప్రప్రథమమున నిర్మించిన కళా విశేషములు చిత్రపటములని చెప్పవచ్చును. ఒక పధ

ముగా ప్రపంచమున మానవుడు జన్మించకపూర్వమే సృష్టి యందు చిత్రపటములు వెలసినవేమో యను సందేహము కూడ కలుగుచున్నది. ఏలయనగా భూమిమీద మానవుని యడుగుల చిహ్నములు కనుపింపకపూర్వమే యీప్రపంచము చిత్ర విచిత్రములగు పటములచే విరాజిల్లినదని చెప్పుటకు తగిన యాధారములు కలవు. భూమిమీద సూర్యాతపమువలన కలిగిన గుంటలు, లోతులు, చీలికలు మనకు గోచరించు చున్నవి. నిరంతర వర్షమువలన యేర్పడిన గుంటలు మనకు కానుపించుచున్నవి. చీమలు పెట్టిన పుట్టలు మన దృష్టి నాక ర్షించుచున్నవి. అగ్నిపర్వతములు బ్రద్దలగుటచే యేర్పడిన విశాల భూభాగములు మనయెదుట నున్నవి. ఈ ప్రపంచము యొక్క అందమును ద్విగుణీకృత మొనరించు నిమిత్తము భగ వంతుడను చిత్రకారుడు నిర్మించిన నదులు, పర్వతములు, అర ణ్యములు మున్నగు వివిధ వర్ణశోభితములగు చిత్తరువులు మన కానందము కలిగించుచున్నవి. ఈ చిత్రములు వివిధ దేశము లందు శీతోష్ణాది పరిస్థితులను నిర్ణయించుచున్నవి. కావున ఈ చిత్ర నిర్మాణాసక్తి సృష్టియొక్క ప్రత్యేకతయని మనము చెప్పవచ్చును.

యుగ యుగములకు ముందు వేటాడుట మానవున కభిమానకు మగుక్రీడయై యుండెను. వేటాడుటకు కావలసిన చిన్నారి పొన్నారి విల్లు, అమ్ములు ఆనాడు మానవుడు నిర్మిం చుకొని యుండెను. వీనిని నిర్మించుటలో అతడు తన శిల్ప చాతుర్యమును ప్రకటించెను. ఇవి వివిధ దేశములలో వివిధ విధములుగా నుండినవి. ఏసుక్రీస్తు అవతరించుటకు ఎన్నియో

వేల సంవత్సరములకు ముందు మట్టితో నిర్మింపబడిన కుండలు, ఇత్తడితో నిర్మింపబడిన బిందెలు మున్నగునవి యున్నట్లు మనకు తెలియుచున్నవి. తమకత్తిని పదునుచేయుటకై రోమనులు ఉపయోగించిన శిలలను మనము జూచుచున్నాము. చైనాలో దొరకిన రోమను మతగురువులయొక్క ప్రతిమ యొక్కటి మనకు నేడు దొరకినది. ఆరోజులలో రాజు లొండొరులతో యుద్ధములు గావించినప్పుడు ఉపయోగించిన శస్త్రాస్త్రములు మనకు లభించుచున్నవి. స్పానిషు వారిచే ఇంగ్లండుమీద ఉపయోగింపబడిన ఫిరంగిగుండు మనకు దొరికినది. అలెగ్జాండరు కాలమునాటి శిలాప్రతిమలు మనకు లభించినవి. బౌద్ధ విహారములందలి చిత్రపటములు మనకు వేల సంవత్సరముల క్రింది నాగరికత స్వరూపమును వ్యక్త మొనరించుచున్నవి. అశోకుని శిలాస్థంభములు ఆనాటి యుదంతములు మనకు తెలియచేయుచున్నవి. ఇవి యన్నియు చారిత్రక చిత్రపటములుగాక మరేమి? ఏలయనగా ఎన్నియో సంవత్సరముల క్రిందటి చరిత్రలను మనకియ్యవి బోధించుచున్నవి. ఈ సాధన సామగ్రినుండి గ్రహించిన విషయములే మన కాధారములు.

## ప్రాచీన నాగరికత

మానవ నాగరికతా పరిణామమును సూచించి వివిధ దేశములందలి పరిస్థితులను మనకు తెలుపు యీ చిత్రముల చరిత్రను తెలిసికొను కుతూహలము మనకుగలుగుట సహజమే. మట్టితో ప్రతిమలను తయారుచేయుట, శిలలమీద చిత్రము

లను చెక్కుట మున్నగునవి యీ చిత్రనిర్మాణము యొక్క ఆరంభదశలు. తరువాత మానవుడు యెముకలపైన మృగరూపములను గీయుటకు ప్రయత్నించి యుండవచ్చును. అనంతరము మానవుడు తాను నివసించు గోడలపైన వింతవింత చిత్రములను గీయుటకు ప్రయత్నించి యుండవచ్చును. ఫ్రాన్సునందలి డార్డాను మరియు స్పెయిన్ నందలి ఆల్పమూరాలోని గుహలలో నాగరికత యొక్క ప్రారంభదశయందు మానవునిచే గీయబడిన చిత్రములు మనకు దృగ్గోచరమగుచున్నవి. ఈచిత్రములను గీసిన ఆ పురాతన ఆటవిక జాతులు ఎన్నియో శతాబ్దముల క్రింద నశించిపోయినవి. చారిత్రకముగా ఆ చిత్రముల కాలనిర్ణయము చేయుటకూడ నేడు మనకు సాధ్యముకాదు. ప్రపంచ చరిత్రయందలి ఏ యుగమున్నైనను తీసికొనుడు. మానవుడు తన సమకాలిక నాగరికతయొక్క చిహ్నములను ప్రతిమలను విడిచిపోయినట్లు మనకు స్పష్టము కాగలదు. ఆ చిహ్నములు ఆ ప్రతిమలు, యీ గ్రంథమున పేర్కొనబడిన అనేక విషయముల కాధారములు. ఇవి యన్ని దేశములందును అన్ని కాలములందును మనకు దొరకుచున్నవి. ఎక్కువగా జనాకీర్ణముగాని ఆస్ట్రేలియా ఖండమున మానవ జాతియొక్క అరుణోదయ కాలము నవలోకించినచో శిలలపై గీయబడిన మృగరూపములు మనకు దొరుకుచున్నవి. దక్షిణ సముద్రమునందలి ద్వీపములలో చారిత్రక కాలనిర్ణయమున కతీతమగు అజ్ఞాతయుగమున శిలలమీద చెక్కబడిన మిక్కిలి యెత్తయిన విగ్రహములు మనకు కానుపించుచున్నవి. ప్రాచ్య దేశముల వంక నొకమారు మన దృష్టిని మరల్చినచో అందు గణనా

తీతములగు దేవాలయములు దేవతా విగ్రహములు మనకు కానుపించుచున్నవి. ఇవి యెన్నడు నిర్మించిరో యెవ్వరు నిర్మించిరోగూడ మనకు తెలియకున్నది.

ఆఫ్రికా ఖండమున నేటికిని కొన్ని ఆటవిక జాతులు ఇరువదివేల సంవత్సరముల క్రింది పరిస్థితులలోనే నివసించు చున్నారు. ఆసియాఖండమునందు భూమిని త్రవ్వగచో అనేక కళావిశేషములు దొరికి చారిత్రక సత్యములు బయల్పడు అవ కాశములు గలవు. మహెంజదారో శిథిలములు కొన్నివేల సంవత్సరములక్రింది నాగరికతను బహిర్గతము గావించినవి. కొండాపురము ఆంధ్ర చారిత్రక విశేషములను కొన్ని వెల్లడి చేసినది. ఇంకాస్ నందలి జీర్ణ పట్టణములలో మనకు ఎన్నియో శిల్ప విశేషములు కానుపించుచున్నవి. ఈవిధముగా మనము శిల్పమునందును, చిత్రము లందును దేవాలయము లందును మట్టిచే తయారుచేయబడిన సాధనములందలి ఇత్తడి మున్నగు లోహములయొక్క పాత్ర నిర్మాణమునందును, వేటాడుటకు, యుద్ధమొనరించుటకుపయోగించిన ఆయుధములందును మానవ నాగరికతయొక్క చరిత్రను పఠింపవచ్చును. అన్ని దేశము లందును అన్ని కాలములందును మానవుడు చిత్రములను నిర్మించుచునే యున్నాడు.

ఈవిధముగా ఆరంభింపబడి చిత్రము శిల్పము కాల క్రమమున అత్యద్భుతముగా అభివృద్ధినొందినవి. వివిధవర్ణముల సమ్మేళనము, చిత్రవిచిత్రములగు రంగులయొక్క కలయిక మున్నగునవి కళావికాసముయొక్క క్రమపరిణామము సూచిం చుచున్నవి. రాజనగరములు, సౌధములు. అంతఃపురములు,

దేవాలయములు, యీ కళాభివృద్ధికి ఆటపట్టులైన. ప్రాకారములు, గోపురములు, గోడలు, మున్నగు వానియందు యీ వర్ణసమ్మేళన సౌందర్యము ప్రత్యక్షమగుచున్నవి. ఈజిప్టు దేశమునందలి రాజులయొక్క సమాధులను తిలకించినచో అచ్చటి శిల్ప సౌభాగ్యము, రంగులయందమును వీక్షించినచో అవి కొన్నివేల సంవత్సరములక్రింద నిర్మింపబడినవయ్యును నిన్ననో మొన్ననో తయారు చేసినట్లు మనకు భ్రమ కలిగించుచుండును. బాబిలోనియా, అస్సీరియా, క్రీటు మున్నగు దేశములందును ఇట్టి శిల్ప సౌందర్యము మనకు కానుపించుచుండును. గ్రీకు సామ్రాజ్య మంతరించినది. గ్రీకు ప్రజల పరాక్రమము, వైభవము స్వప్నగత ప్రాయములైనవి. కాని గ్రీకులు స్ఫటిక శిలలపై చెక్కిన శిల్పసౌందర్యము ప్రపంచమున శాశ్వతముగా నుండగలదు. ఆ పురాతన విహారములందు సౌందర్య ఆరాధకులగు పరివ్రాజకులు చెక్కిన చిత్తరువులు మాత్రము నిరంతరము చూచువారిని అద్భుతాశ్చర్య ప్రమోద మగ్నమానసులను గావించుచుండును.

అజ్ఞాతయుగమున అనామకుడగు ఆటవికు డెవ్వడో ఒక ఎముకపైన మృగరూపమును గీయుటతో ఆరంభమైన కళ తరువాత ననేక సహస్రాబ్దముల యనంతరము భారతీయులు, గ్రీకులు, ఈజిప్షియన్లు అస్సీరియన్ల మున్నగు వారియందు మహోత్కృష్టముగా వికసించినది. కాలక్రమమున నది అత్యద్భుతముగా అభివృద్ధిగాంచి నేడు ఆధునిక చిత్రకారుని చేతియందు ఛాయాగ్రహణాది యంత్ర సహాయమున శాస్త్రీయ విజ్ఞానమునకు కళా సౌందర్యమునకు చక్కని సామరస్యము కలిగినది.

ఒకమారు బౌద్ధయుగమువంక తిలకింపుడు. బౌద్ధ విహార ములందు శిల్పము చిత్రలేఖనము పరిణత ప్రజ్ఞను సాధించినవి. బుద్ధ భగవానుని జీవితము యీ విహారములందు ముక్కాలి రమ్యముగా చిత్రింపబడినది. మాయాదేవి యందాతడుద్భ వించుట ఆతని శైశవ క్రీడలు, రాజవీధులలో సంచారము, ప్రపంచమునందలి బాధలను సందర్శించుట, మనోవిప్లవము, భార్యా పరిత్యాగము, మోక్షసాధన మున్నగునవి యీ చిత్ర పటాలు ప్రదర్శించుచున్నవి. రాజధానీనగర ప్రాభవము, ప్రజల ఆంతరంగిక జీవనాదులను గురించికూడ మనము వీని వలన కొన్ని విషయములను గ్రహింపగలుగు చున్నాము. నలందా, తక్షశిల మున్నగు విజ్ఞాన కేంద్రములను గురించి మనము తెలిసికొన గలుగుచున్నాము. ఈ విధముగా మన యెదుటలేనట్టి అనేక శతాబ్దముల క్రిందివిషయముల నీ చిత్ర ములు మనయెదుట ప్రదర్శించుచున్నవి.

మనము నాగరికులుగా ప్రపంచమున అభివృద్ధి నొందు చున్నాము. నేడు విశ్వ సౌభ్రాతృత్వము జగత్కల్యాణము మన ఆదర్శముగా నున్నవి. హింసా కళంకితముగాని ప్రేమ మందిరమును శాంతినిలయము నగు ప్రపంచమును నిర్మించు టయే మన యాదర్శమని ప్రపంచ మహాపురుషులయం దగ్ర గణ్యుడగు మహాత్ముడు ఆదేశించినాడు. ప్రపంచ శాంతిని విశ్వ సౌందర్యము మనము అన్వేషించుచో యీ ప్రపంచము నందలి సోదర జాతులను గురించి తెలిసికొనవలసిన యవసరము మనకు కలదు. మనము వారినిగురించి చక్కగా తెలిసికొ న్నప్పుడే వారిని మనము ప్రేమించగలుగుదుము. వారిని గురించి

మనకు లేనిపోని యపోహలు, ద్వేషము, ఈర్ష్య తొలగిపోవును మనకు చక్కగా తెలిసినవ్యక్తిని ఎన్నడును ద్వేషింపజాలము

జననీజన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసి అని ఆర్యోక్తి. మాతృదేశమునకై మానవుడు చేయరాని త్యాగము లేదు. ప్రపంచమున ఎన్నియో దేశములు కలవు. ఎవరికి వారు నా దేశమే గొప్పయని భావింతురు. అమెరికా దేశమున నున్న ధనమంతయు మనకిచ్చినను యూరోపు నందలి ఆధునిక శాస్త్రీయ విజ్ఞానము నంతయును మనకిచ్చినను మనము వానిని మాతృదేశములుగా భావింపజాలము. భారతాంబయే మన కన్నతల్లియని ఆమెను ఆరాధించెదము. ఆమె మనకు సుజల సుఫల, సస్యశ్యామల. ఆమెను మనము శుభ్రజ్యోత్స్నా పులకితయామిని యనియు ఫుల్లకుసుమిత ద్రుమదళశోభి యనియు. సుహాసిని యనియు సుమధుర భాషిణి యనియు కీర్తించెదము. గంగా, యమునా నదులను గాంచియు, గోదావరి, కృష్ణ వేణులను తిలకించియు, పూర్వ విజ్ఞానమును ప్రాచీన చరిత్రను స్మరించియు కాళిదాస భవభూతి మహాకవీంద్రుల కవితా రసాస్వాదనము గావించియు తాజమహాలు, ఎల్లోరా, అమరావతీ మున్నగు వాని శిల్ప సౌందర్యములను వీక్షించియు మనలో మన ముప్పొంగి ఉత్తేజితుల మగుచున్నాము. కాని యొక మాట. కాకిబిడ్డ కాకికిముద్దు. ఎవరితల్లి వారికిమంచిది. ఎవరి దేశము వారికి గొప్పది. ఇతరుల యభిప్రాయములను గౌరవించుటయే, సోదరజాతుల నాగరికతయందు పూజ్యభావము గలిగియుండుటయే నిక్కమగు సంస్కృతి లక్షణమని, మనము గ్రహింపవలయును. అప్పుడే మనము విశ్వసంస్కృతి యను

ఆదర్శముతో ప్రపంచ మహా పౌరులుగా భాసిల్లగలుగుదుము. మనకు భారతాంబ యెట్లు కన్నతల్లియగునో అట్లే ఇతర జాతులకును మాతృభూమి కలదనియు, వారినిగురించి మనము తెలిసికొన వలసిన విషయములు కలవనియు మనము గ్రహింపవలెను. మనకువలెనే వారికిని గర్వింపతగిన గతము ఉజ్వలమగు భవిష్యత్తు కలదని మనము గ్రహింపవలెను.

---

# దక్షిణ అమెరికా ఆదిమ నివాసులు

## ఇంకాసు జాతివారు

బొలీవియా, పెరూ దేశాలు ఇంకాసు జాతివారికి నివాసస్థానములు. ఈ దేశములు నేటికిని ఎడారి ప్రదేశములు.

చారిత్రకముగా యీ ఇంకాసును గురించిన విశేషాలు మనకు తెలియవు. యుద్ధము చేయుటలో మంచి యభినివేశము కలిగిన వీరు, అయిమారా ఇండియన్‌లయొక్క ఉపశాఖయని మాత్రము మనకు తెలియుచున్నది. ఆండీసుపర్వత పంక్తులయందు యీ అయిమారాలు నివసించుచుండెడివారు. వీరికి సోదర శాఖకుచెందిన క్విచస్ అను జాతి ఉత్తర పశ్చిమ ప్రాంతమున నివసించుచున్నారు.

ఈ రెండు తెగలవారు మాట్లాడు భాషలయందలి సామ్యమును బట్టి ఈ రెండుశాఖల సన్నిహిత సంబంధమును మనము ఊహింపవచ్చును.

మొదటినుండియు ఈ ఇంకాసు వీర్యవంతమగు జాతి. వీరి కత్యంత ప్రాచీనమగు నాగరికతగలదు. ఆ గొప్ప యెత్తయిన పర్వతపంక్తియందు రాకపోకలకు అనుకూలముగా వీరెన్నియో వంతెనలను నిర్మించినారు; శాశ్వతముగా నుండదగు రోడ్డులను వేసినారు.

స్పానిషువారు పెరూను జయించి ఆక్రమించుకొనిన గాధను మనము పఠించునప్పుడు, ఇంకాస్‌యొక్క నిర్మాణ విశేషములు, సుందరములగుదృశ్యములు, చిత్రములు మున్నగు వానినిగురించిన వివరము లనేకములు మనకు తెలియుచున్నవి. వారి రాజధానీ నగరమగు కుజ్కోయందు సూర్యభగవానుని సువర్ణ దేవాలయముండెను. ఈదేవాలయముయొక్క గోడలు సన్నని బంగారు రేకులచే కప్పబడియుండెను. దేవాలయో ద్యానవనమున బంగారము చేతను వెండిచేతను చేయబడిన మృగములు, కీటకములుండెను. దేవాలయము మాత్రము ఒక విధమగు గడ్డిచే కప్పబడియుండెను.

అప్పటి వారి రాజకీయ సాంఘిక వ్యవస్థలయందును కొంత ప్రత్యేకత యుండెను. "నా విష్ణుః పృథివీపతి" అని మనవారన్నట్లు వారికి రాజు దైవాంశ సంభవుడు. సూర్యుని కిరణములు ప్రతివారియందును ప్రసరించినట్లు, రాజుగారి ప్రభావముకూడ ప్రతివారియందుండెడిది.

ఇటీవలనే ఇంకాస్‌నిర్మించిన మాచూపిక్ అను అద్భుత శిధిలములు కనుగొనబడినవి. కుజ్కోకు ఉత్తర పశ్చిమము నందలి పర్వత పంక్తులలో నివి కలవు. ఈ పర్వతపంక్తులందు ఉరుబాంబానది ప్రవహించుచుండును. ఇచ్చటి పురాతన

దుర్గము, రాజధానీనగరము అమెరికా దేశమునందలి అద్భుత చిత్రములలో అగ్రగణ్యమైనవి. అమెరికన్ పరిశోధకులు వీనిని కనుగొనినప్పుడు ఆ ప్రాంతమునందలి అధికభాగము అరణ్యావృతమై యుండెను. ఇది కొన్ని శతాబ్దములక్రింది విషయము. ఈమధ్య పరిజాతుల యాక్రమణములు, స్వాతంత్ర్య సమరములు అనేకము జరిగినవి.

ఇక పెరూ దేశమువంక మనదృష్టినిమరల్తాము. ఇంకాస్ యొక్క నాగరికత ముగ్గదొడిగి వికసించి, వాడువారి, రూపు మాసిన యీ ప్రదేశ మొకనాడు దక్షిణ అమెరికాకు తల మానికమై యుండెను. ఇదియంతయు పర్వత ప్రదేశము. ఇచ్చటి దృశ్యములు మనోహరములు కావు. నిరంతరము చలి గాలి వీచుచు మంచుగడ్డచే కప్పబడియున్న ఈ ప్రదేశము లందు, ఇక్షుగడ్డి తప్ప మరేమియు పెరిగి పెంపుగాంచదు. ఈ గడ్డిని అచ్చటి గొర్రెలు, మేకలు మేయును. చెట్టు చేమ లేని ఈ బీళ్ళయందు కొన్ని కుగ్రామములు గలవు. అచ్చట మాత్రము జొన్నలు, బంగాళాదుంపలు కొద్దియో గొప్పయో ఫలించును. నదీ ప్రవాహమువలన అచ్చటచ్చట సస్యాను కూలములైన ప్రదేశములందు మాత్రము వ్యవసాయ ప్రయత్నములు జరుగుచుండును. ఈ ప్రదేశములందు యీనాడు నివసించుచున్నవారు ఆ ప్రాచీన యింకాస్ యొక్క సంతతివారనునది గమనింపతగిన విశేషము. బొలీవియా ప్రాంతమున మాత్రము వారిప్పటికి ఐమారాలు అను పేరుతో పిలువబడుచున్నారు. పెరూదేశమునందలి పార్వతీయులు క్విచూలు అను పేరుతో పిలువబడుచున్నారు. ఐమారాలు ఎట్టిగా

నుందురు. నల్లని చక్కటి శిరోజములు, విశాలమైన నుదురులు కలిగిన క్వేచూలు సన్నగా దృఢకాయులుగా నుందురు. వీరు ఎక్కువగా మాటకారులు కారు. మాట్లాడినప్పుడైన ఎక్కువ తెలివితేటలను ప్రదర్శింపరు. ఓపిక, కష్టపడి పనిచేయుట మున్నగు సద్గుణములు వీరియందున్నవి. అవినయము, ధూర్తత్వము వీరి స్వభావమునకు విరుద్ధములు. వీరు కోకా ఆకులను తినెదరు. ఈ యాకులనుండియే కొకైను తీసెదరు. సారాయము త్రాగెదరు. కావుననే కాబోలు వారు మిక్కిలి మందబుద్ధులుగా గనపడెదరు,

వీరు ధరించు వస్త్రవిశేషమునకు పేరు పోంచో. ఇది గొంగడితో కుట్టబడును. మనము తొడుగుకొను పైజామాల కన్న నాలుగు అంగుళముల యెక్కువ పొడుగగు తెల్లని పైజామాలను ధరించుట వీరికొకనాగరికత, ఫ్యాషన్. ఒంటెను బోలిన జంతువు దక్షిణ అమెరికాలో ఇలామా యనునది కలదు. దీని బొచ్చునుండి వారు వస్త్రములను తయారు చేసుకొనెదరు. ఈ జంతువు సామానులు మోయుటయందే కాక, ఉన్ని ఉత్పత్తి చేయుటకును ఎక్కువగా తోడ్పడును. ఇలామా వలెనేయుండి దాని సోదరజాతికి చెందిన అల్పాకా అను జంతువు ప్రపంచమునందంతటికన్న ఎక్కువ మెత్తనైన ఉన్ని యొసంగు జంతువు. తామే వడికిన నూలుతో క్వెంఛ్ స్త్రీలు ఉన్ని శాలువలను తయారుచేయుదురు. పురుషులకన్న స్త్రీలు ఎక్కువ వస్త్రములను ధరించెదరు. వీరొకవిధమగు టోపీని పెట్టుకొనెదరు.

కుజ్కోనగరము ఇంకాస్‌యొక్క పురాతన రాజధాని. దక్షిణఅమెరికాలోని అత్యంత ప్రాచీననగరము. ప్రాతక్రొత్తల మేలి, కలయిక యీ నగరమునందు కనులపండువు చేయు చుండును. కంచరగాడిదలచే యీడ్వబడు రథములు ఇచ్చట మనము జూచుచున్నాము. టెలిఫోన్, విద్యుద్దీపము, సిని మాలు మున్నగు ఆధునిక విశేషములు నాగరికత ఇచ్చట గాననగును. ఈ ఆధునిక సామగ్రితోపాటు పురాతన కాలము నందలి రాతికట్టడములు సౌధములు నేడిచ్చట మనకు నేత్ర పర్వము గావించుచుండును. ఈ నగరముయందు ఇండియన్లు స్పానిష్‌వారుగలరు. ఇందులో అధికసంఖ్యాకులు ఇండియన్లే. పూర్వకాలమునందు ఇంగ్లండునందలి బాజారుల వంటివి నేడు యిచ్చట కలవు. స్వదేశ వస్తువులతో అమెరికా సంయుక్త రాష్ట్రము యూరోపునుండి దిగుమతియై చాల చౌకగా విక్ర యింపబడువస్తువు లిచ్చట దొరకును. ఇచ్చటి మధ్యాహ్న సమయములందు మిక్కిలి వేడిగా నుండును. మిక్కిలి మనో హరముగా నుండును. ఇచ్చటి బ్రాజిల్ లోయలో విశాల మగు అరణ్యము కలదు. ఇది మిక్కిలి నిబిడారణ్యము. ఇచ్చట నివసించువారు అనాగరికులగు ఆదిమానవులు. ఇంకాస్‌యొక్క ప్రభావము వీరియందున్నను వీరికొక గొప్ప ప్రాచీన నాగరికత కలదనుటకు నిదర్శనములు లేవు. వీరిలో కొందరు నేడును జంతువుల వేటాడి పచ్చి మాంసముతో ఉదరపోషణ జేసికొం దురు. వ్యవసాయము జేసి జీవనోపాధిని కల్పించుకొనుట వీరికి తెలియదు. వీరు పరస్పర పోరాటములలో విషపూరితములగు బాణములను ఉపయోగింతురు. వీరిమతము క్షుద్రమైనది. తెల్ల

వారితోపాటు కొందరు ఇండియన్లు కూడ ఇక్కడికి వచ్చి నారు. కాని యీ ఆదిమనివాసులు మాత్రము వీరితో నెట్టి యంటుసొంటు లేక, దూరముగా నున్నారు. ఇంకను వేటా డుచు, గుడిసెలలో నివసించుచు, వీరు నాగరికతా వాసన లేక కూపస్థ మండూకములవలె నున్నారు.

---

# ఉత్తర అమెరికా ఆదిమ నివాసులు

ప్రప్రథమమున తెల్లదొరలు అమెరికా ఖండమున అడుగుపెట్టినప్పుడు యునైటెడ్ స్టేట్సులోను కనడాయందును కలిసి సుమారు 50 లక్షుల ఎఱ్ఱఇండియన్లు నివసించుచుండిరి. కాని తెల్లవారి ప్రవేశముతోపాటు వీరిపాలిట యమధర్మ రాజు ప్రత్యక్షమైనాడు ఇందుకు కారణము వీరిమధ్య పోరాటములు యుద్ధములు మాత్రము కావు. తెల్లవారు ఈ ఖండమునకు మశూచికము ఇన్ ఫ్లూయెంజా మున్నగు రోగ ములను యూరోపు ఖండమునుండి తమవెంట గొనితెచ్చిరి. తత్ఫలితముగా యీ రెడ్ ఇండియన్లు (శోణవర్ణులు) అనే కులు మరణించిరి తరువాత శ్వేతముఖులతోడి పోరాటము, యునైటెడ్ స్టేట్సు సైనికులతో సమరము వీరి జనసంఖ్యను మరింత తగ్గించినది 1870 సంవత్సరము ఈ జాతి యిక నొక పురుషాంతరమున సంపూర్ణముగా నశించునని తలంచబడినది. కాని యునైటెడ్ స్టేట్సు కనడా ప్రభుత్వములు తెల్లవారి యొక్క అంటు సొంటులేని ప్రత్యేక ప్రదేశములు వీరికి నివాస

స్థానములుగా నియమించుటచే, యీ జాతి నేటికిని కథావశేషముగాక మిగిలియున్నది. ఆరోజులలో వీరికి తగిన ఆహార పదార్థములను వైద్యసహాయము నొసంగి ఆ ప్రభుత్వములు వీరిని సంరక్షించినవి. వీరికొరకు ప్రత్యేకముగా పాఠశాలలు, అంగడులు (క్రయ విక్రయములకొరకు) నెలకొల్పబడినవి.

ప్రస్తుతము అమెరికా సంయుక్త రాష్ట్రములలో మాత్రము వీరి జనసంఖ్య 365,000. మరొక 60,000 యితర జాతులతో కలిసిపోయినారు. ఒక్లోహామా వారు అధికసంఖ్యాకులుగా నున్నారు. (70,000) నేడు వీరు మొత్తం 20,000,000 ఎకరములభూమి అనగా ఐర్లాండు దేశముతో సమాన వైశాల్యము కలిగిన ప్రదేశమునకు యజమానులుగా నున్నారు. ఈ ప్రదేశమునందలి ఇండియన్‌లు ఫోర్డుకారులలో విహరించు నంతటి ధనవంతులు. వీరి గృహములు చక్కగా నిర్మింపబడి యుండును. వీరిపిల్లలు పాఠశాలలలో విద్యాభ్యాస మొనరించు చుందురు. వీరు క్యాలిఫోర్నియా, ఆరాజోనా, మిన్నినోటా, దక్షిణ డకోటా మున్నగు రాష్ట్రములందు నివసించుచున్నారు. వీరియందు ముఖ్యమైన తెగలు సియోన్స్, చెయిన్, ఇరోక్వ్యాన్, చోక్టా, చికాసా, సెమినోల్సు మున్నగునవి.

వీరు ప్రప్రథమమున యిచ్చటికెక్కడినుండి వచ్చినారను విషయమును గురించి అనేకచర్చలు, వాదోపవాదములు కలవు. కాని నిజమేమియో నిశ్చయముగా తెలియదు. ఏషియా నుండి వారి మూలపురుషులు వలస వచ్చినారని అనేకులు నమ్ముచున్నారు. అయితే యిది యనేక సహస్రాబ్దములక్రింద జరిగియుండవచ్చును. మానవజాతికి జన్మస్థానమగు ఆసియా

దేశమునుండి వేటగాండ్రు ఒకదేశమునుండి యింకొకదేశము నకు ప్రయాణము చేయుచు పరిభ్రమించుచుండిరి. వీరిలో కొందరిచ్చటకు వచ్చియుండవచ్చును. ఈ వేటగాండ్రు తమ వేటకు యెక్కడ తగిన సౌకర్యములుండి, యెక్కడ వారికి ఆహారము లభించుచుండెనో అక్కడే వారునివసించుచు కొంత కాలమునకు మరొక ప్రదేశమునకు పోవుచుండిరి కావున వారొక ప్రత్యేక ప్రదేశమును స్థిరనివాసము జేసికొని నాగరి కతను అభివృద్ధి జేసికొనలేకపోయిరి. కావుననే తెల్లవారు అమెరికాకు వచ్చువరకు వీరింకను నూతన శిలాయుగములోనే యుండిరి. వీరు శిరస్త్రాణములు, కత్తులు, కొడవళ్లు మున్నగు వానిని తయారుజేయుచు లోహముయొక్క ఉపయోగమును తెలిసియుండిరి.

వీరిలో దక్షిణమున ఎడారి ప్రదేశమున వారికొక సంక టము కలిగినది. ఆ ప్రదేశము జింకలు, పశువులు నివసిం చుటకు యోగ్యమైనది కాదు. ఉష్ణాధిక్యము కలిగిన యెడారి యది. కావున వీరికి ఇచ్చట వేటాడి ఆహారము సంపాదించు కొను సౌకర్యము లేకుండెను. కావున వీరు శాశ్వతముగా నివసించుటకు వీలగు గృహములను నిర్మించుకొని వ్యవసా యము జేసికొనవలసిన యవసరము గలిగెను. జొన్న, పొగాకు, కూరగాయలను వీరు పండించిరి. గొర్రెలు, సీమకోళ్లు, మున్నగు పెంపుడు జంతువులను వీరు సాదుకొన నారంభించిరి. బట్టలుగా ధరించుటకు తగిన చర్మములు, తోళ్ళు దొరకక వెంట్రుకలనుండి వీరికి తమ వస్త్రములను తయారు చేసుకొన వలసిన యవసరము కలిగెను. వీరు మట్టితో కుండలు చేయు

టను నేర్చుకొనిరి. లోహముయొక్క ఉపయోగము కొంత తెలిసికొని యుండిరి.

వీరిని ఎఱ్ఱ ఇండియన్‌లని పిలుచుటకు కారణము చిత్రమైనది. ఏలయనగా వీరు ఎఱ్ఱగా నుండరు. ఇండియన్‌లు గూడ కారు. మొట్టమొదలు ఇచ్చటికివచ్చిన తెల్లవారు స్పానిషువారు. వారు వీరు ఏషియానుండి వచ్చియుండిరని అనుమానించి, ఏషియాను ఇండీసుగా పొరపడి వీరి సస్యము రంగును ఎఱ్ఱనిదిగా భ్రమించి వీరికి రెడ్ ఇండియన్‌లని నామకరణము గావించిరి.

కనడాయందును, సంయుక్త రాష్ట్రములందును నివసించు ఇండియన్‌లకు ప్రత్యేక నాగరికతగలదు. ఇది మెక్సికో నివాసుల నాగరికతకన్న భిన్నమైనది. వీరు వేటకొరకు కుక్కలను గృహములలో సాదుకొనుచుండిరి కాని శ్వేతజాతులు ప్రవేశించువరకు వీరు గుఱ్ఱముల నెరుంగకుండిరి.

గుల్లలు, చాపలు వీరు తయారుచేసిరి. భూమిమీద మిక్కిలి చులకనగా తీసికొనిపోవ సాధ్యమగు శిబిరాలను వీరు నిర్మించిరి. నేడును నిర్మించుచున్నారు. చర్మములను శుభ్రపరచి దానితో వీరు బట్టలను సిద్ధపరచుకొని గుడారములను గూడ నిర్మించు కొనుచుండెడివారు. దున్నపోతుల, బఱ్ఱెల మాంసమును క్రొవ్వుతో కలిపి చిరకాలము నిలువయుంచుకొను పద్ధతి వీరే మొట్టమొదలు కనుగొని, అవలంబించిరి.

శ్వేతముఖులు వ్రాసిన గ్రంథములవలన వీరు తాము చెరగొన్న వారిని పలువిధముల బాధించి కాల్చి కష్టపెట్టెడి

వారని తెలియుచున్నది. గాని యీ క్రూరకృత్యములు వారికి నేర్పిన ప్రబుద్ధులు మన తెల్లదొరలే. "నీవు నేర్పినవిద్యయే నీరజాక్ష" యనగా మొట్టమొదలు అక్కడకు వచ్చిన వారితో వీరు మిక్కిలి దయతోడ మెలగిరి. వీరి భూమిని తమ సహజ స్వభావానుగుణముగా మన తెల్లదొరలు అన్యాయ ముగా ఆక్రమించుకొనుటవలన వీరియందు క్రూరబుద్ధి చెల రేగినది. ఫిలడల్ఫియా కనుగొనిన విలియం పెన్ టో తో, వీరికెట్టి సంఘర్షణ కలుగలేదనుటకు ఆయన రచనలే సాక్ష్యము. ఓనేట్ అనువాడు తాను ఆరిజోనాలో పయనించుచున్నపుడు ఈ ఇండి యన్లు తనయెడ సుహృద్భావముతో ప్రవర్తించిరని తెలుపు చున్నాడు. వీరు తెల్లవారియందు సత్యసంధతను ఆశించిరి. అదియే వారొనరించిన గొప్ప తప్పు. అందువలననే వారి యందుక్రూరత్వ మారోపించబడినది.

పిచ్చివారియందును, మనోవ్యాకులము గలిగిన వారి యందును వీరు మిక్కిలి దయగలిగి యుందురు. వీరి కరుణా స్వభావము ఒకమారు ప్రొఫెసర్ హేడన్ అనువానికి వీరి నుండి తప్పించుకొనిపోవు అవకాశము కలుగజేసినది.

వీరు సాధారణముగా శాసనమునకు బద్ధులైయుందురు. పూర్వకాలమున యుద్ధము ప్రకటించు అధికారము ఏ యొక వ్యక్తికి లేకుండెను. ఆ యధికారము ఒక కౌన్సిలు చేతిలో నుండెడిది. ఈ కౌన్సిలు అంగీకారము లేక యుద్ధమును ప్రక టించినవారు నిర్దాక్షిణ్యముగా శిక్షింపబడుచుండిరి. బెత్తపు దెబ్బలకు, కొరడాదెబ్బలకు గురికావలసి వచ్చుచుండెను. దానికి యెదురు తిరిగిన మరణదండనము జరుగుచుండెడిది.

అనాగరికులకు ఈ యిండియనులందు మంచిగుణము లనేకములు గలవు. చిన్నపిల్లలయందు వీరికి మిక్కుటమగు ప్రేమ. పసిబాలురను వీరు శిక్షింపరు. భార్యా పుత్రులను తమకన్న యెక్కువగా ప్రేమించుకొందురు. మగపిల్లలకు ఆయుధములు ఉపయోగించు విధానము చిన్నప్పుడే నేర్పుదురు. ఆడపిల్లలకు గృహ కార్య నిర్వహణమునందు శిక్షణ యొసంగుదురు.

ఈ ఇండియన్‌లు మిక్కిలి తక్కువగా నవ్వెదరు. అంత మాత్రమున వారి స్వభావమునందు హాస్యము లేదని తలంచుట పొరపాటు. అతిథి అభ్యాగతుల నాదరించుట వీరికి వెన్నతో బెట్టిన విద్య.

వీరిలో వివిధభాషలు మాట్లాడువారు గలరు. మెక్సికో సరిహద్దునకు ఉత్తరముననున్న అమెరికాలోనే సుమారు ఏబది యరువది భాషలు మాట్లాడువారుగలరు. ఈ భాషలలో ఒక దానితో మరొకదానికి ఎట్టి పోలికలు లేవు.

వీరి వంశవృక్షము, మూలము వీరికే తెలియదు. పలువురు పలువిధములగు కట్టుకథలను చెప్పుచుందురు. సంయుక్త రాష్ట్రమున కనడాలోని కన్న వీరి జనసంఖ్య యెక్కువ, కనడాలో తెల్లవారు సంయుక్తరాష్ట్రములందు వలెగాక వీరియెడ ఎక్కువ అన్యాయముగా ప్రవర్తించలేదు. వీరు వ్యాపారము చేసికొనుటకు కొన్ని యవకాశములు కల్పించిరి. కనడా ఫ్రెంచివారి యధికారమున నున్నప్పుడు ఫ్రెంచివారనేకులు ఇండియన్ స్త్రీల పెండ్లాడిరి. ఈ సంకర వివాహ సంతానము నేటికిని గలదు. సంయుక్తరాష్ట్రములందును, కనడాయందును, వీరు

అతి త్వరితముగా నవనాగరికులగు చున్నారు ఒక్క బ్రిటిష్‌వారి కొలంబియాలో తప్ప కనడా యందంతటను వీరికి తెల్లవారితో సమానముగా వోటింగుహక్కు కలదు 1924లో క్యూబెకు శాసనసభ కొక ఇండియన్ యెన్నుకోబడినాడు

కనడాలో వీరి రక్షణకొరకు ప్రత్యేకశాసనములుకలవు అచ్చట మత్తును కలిగించు ద్రవ్యములను వీరికి విక్రయించుట శాసన ప్రకారము గొప్ప అపరాధము వీరి సమాధులను రక్షించుటకుగూడ నొక శాసనము కలదు

వీరు శవమును మృగచర్మముతో చేసిన గుడారము లలో పాతిపెట్టెదరు. చనిపోయిన వానికి సంబంధించిన బాణములు, విల్లు, తుపాకులు మున్నగువానిని వానితోడనే పూడ్చిపెట్టెదరు. వీరు తలపై ధరించు టోపీ గుఱ్ఱపు వెంట్రుకలతో చేయబడును. తెల్లని చిప్పలను ఈ ఇండియన్ జాతులన్నియు పూర్వకాలమున నాణెములుగా ఉపయోగించెడి వారు. వానితో చేయబడిన దండకడియములను వీరు పెట్టుకొందురు

వీరి నామములు మిక్కిలి వింతగానుండును. 1. అత్తను జంపినవాడు 2. వారిని పట్టుకొని చంపును. 3. పిచ్చిమరదలు 4. నెత్తిమీద కొట్టును మున్నగునవి యిందుకు నిదర్శనములు.

మంత్ర తంత్రములవలన భూత పిశాచములపై అధికారము చెలాయించువారు. వీరియందు గలరు. ఇందుకు కఠినశిక్షణ యవసరము. శిక్షణకాలమున పెక్కు దివసములు ఉపవాసము చేయవలసి యుండును. కొన్ని సమయములందు దేహమునందు ఘోరమగు గాయములు చేసికొనవలసి యుండును. ఈ మంత్ర తంత్రములందు ప్రవీణులగువారే వీరి

యందు వైద్యులు, పురోహితులు, మత ప్రవక్తలు. వీరికి కూరగాయలు మరియు చెట్లయొక్క గుణములు బాగుగా తెలియును. వానిని వీరు ఔషధములలో ఉపయోగింతురు. స్వేద వైద్యమువలన వ్యాధులు పోవునని వీరు విశ్వసించెదరు. ఇదియొక విచిత్రమగు పద్ధతి. చర్మములచేతను గొంగళ్ళ చేతను, మట్టిచేతను యీ స్నానపుగది నిర్మింపబడును. రోగి యిందులో ప్రవేశించినంతనే యివతల నున్నవారు రాళ్ళను బాగుగా గాల్చి అది మిక్కిలి వేడిగా నున్నప్పుడు కట్టెలతో ఆ గదిలో పడవేసెదరు. తరువాత ఆ రాళ్ళమీద నీళ్ళుపోసి ద్వారమును మూసివేసెదరు. చెప్పరానంత చెమ్మటలో కొంతసేపు రోగి యీగదిలో నున్నతరువాత అతనిని ఇవతలకు కొనితెచ్చి అతనిచే చన్నీట స్నానము చేయింతురు.

వీరిలో మరియొక విచిత్రమగు పద్ధతి ఆతపనాట్య మనునది. ఇది వీరికొక వేడుక. దీనికొక విశాలమగు ప్రత్యేక ప్రదేశమును యేర్పాటుచేసి అక్కడ చక్కగా అలంకరింప బడిన గుడారములను నిర్మించి ఒక చిన్నగ్రామమును తయారు చేయుదురు. అచ్చట నొక ప్రస్వేదాశ్రమమును నిర్మింతురు. ఏలయనగా యీ వేడుకలలో పాల్గొను వారందరు మొట్ట మొదలు యీ ఆశ్రమమున పవిత్రులు గావలయును.

ఇది సాధారణముగా వసంతకాలమున జరుగును. ఈ సమయమునందు మాత్రమే భర్తలు సామాన్యముగా ధరించు ఈకలను భార్యలు తమ శిరోజములందు అమర్చుకొందురు. ఇతరసమయములందిది నిషిద్ధము. ఈవేడుకయందు నాయకుని వస్త్రధారణము గమనించ తగినది. అతడు కంచుకము ధరించి

కాళ్ళకు మృదువైన ఒక చర్మముతో చేయబడిన రంగు రంగుల అలంకారములను ధరించును. ఎర్రనక్క చర్మముతో చేయబడిన శిరోవేష్టము ధరించును. ఈశిరోవేష్టమునకు వెనుక నొక టోపీ వ్రేలాడుచుండును. టోపీ ఒక విధమైన తెల్లని చర్మముతో చేయబడి అందు రెండు గరుడపక్షుల ఈకలు అమర్చబడియుండును. ఈ సందర్భమున వారొనరించు ప్రార్థన యీ విధముగా నుండును. (1) మా ప్రజలందరు ఎండకాలమున ఉష్ణాధిక్యమును చలికాలమున చలిని సహించి ఆనందముతో నుండవలయును. (2) అనేకులు జ్వరముతోడను దారిద్ర్యముతోడను బాధపడుచున్నారు. వారియందు దయ వహించవలెను. వారికి ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగవలయును. 3. మా పూర్వుల వేడుకలవలె నేడు మేము గావించు వేడుకలుగూడ జయప్రదముగా జరుగుగాక. అందేమయిన పొరపాటుజరిగినచో మేము క్షమార్హులము. (4) తల్లి వసుంధరా వర్షము సమృద్ధిగాకురిసి పంటలు చక్కగా ఫలించవలెను. (5) మాకు శాంతిని, దీర్ఘాయుష్యమును ప్రసాదించవలెను. (6) మేము నీ పిల్లలము నిర్మలహృదయముతో నిన్ను అర్థించుచున్నాము.

ఈ సమయమున వీరు తమ ముఖములకు రంగు వేసుకొనెదరు. నాయకుని బాహువులను ఇంద్రధనస్సుయొక్క చిహ్నములచే అలంకరించెదరు. అతని చెక్కిళ్లపై నక్షత్రములను చిత్రించెదరు. అతని పెదవులమీద ఎర్రని ర్రాసు వేయబడును.

ఇదిగాక యీ ఇండియన్‌లకు అనేక ఇతర వినోదములు కలవు.

పూర్వకాలమున వీరు జేయుచుండిన ఉత్సవాలు అనేకము యిప్పుడు ఆగిపోయినవి. సంయుక్త రాష్ట్రములో నీగ్రోలను మిక్కిలి హీనముగా జూచెదరు. ప్రపంచము నుద్ధరింప కంకణము గట్టుకొన్నామని చెప్పు తెల్లదొరలు పాలించు ఈ రాష్ట్రాలలో తెల్లవారికి నల్లవారికి మధ్య అంతర్వివాహములు జరుగరాదను కఠిన శాసనము కలదు.

ఈ ఇండియన్‌లలో కొందరు డాక్టర్లు, బారిష్టర్లు, రచయితలు కళోపాసకులు మున్నగు విద్యావంతులు కలరు. కాని వాణిజ్యరంగములో వీరు ప్రవేశించలేదు. ఆమెరికా సైన్యమున వీరు అనేకులుగలరు. మొదటి ప్రపంచ మహాసంగ్రామములో 15,000 మంది సైనికులుగా పాల్గొనిరి.

---

# దక్షిణద్వీపముల ఆదిమవాసులు

మనోహరమగు ప్రకృతి దృశ్యములతో ఆరోగ్యప్రదమగు శీతోష్ణ పరిస్థితులతో అలరిల్లు దేశమునందు మానవ జీవితము ఆనందపూర్ణమై యుండునని తోచుట సహజము కాని అట్టి పరిస్థితులయందే మానవుడు అధోగతుడైయున్న నిదర్శనములు మనకు యీ ద్వీపములయందు కనపడుచున్నవి. మానవుడు కష్టాలలో మునిగియున్నప్పుడే ఆతనిలో దాగుకొనియున్న ప్రతిభ పైకివచ్చి, పుటముపెట్టిన బంగారమువలె ప్రకాశించును.

దక్షిణ సముద్రమునందలి ద్వీపములు ఆనందనిలయములని ప్రసిద్ధిగాంచినవి.

ఈ ద్వీపాలను రెండు తరగతులుగా మనము విభజింప వచ్చును. అగ్నిపర్వతాలచే నిర్మింపబడిన తాహితీ ద్వీపాలు. వీనియందు పర్వతములు, నదులు, జలపాతములు విశేషముగా కలవు. రెండవతరగతికి జెందిన ఏమోటాలు మున్నగునవి. ఇవి ప్రకృతిసౌందర్యమునకు ఆటపట్టులు.

అచటి జనులను "పాలనీయన్"లని పిలిచెదరు. వీరు చూచుటకు మిక్కిలి చక్కనివారు. ఎల్లగానుందురు. నున్నని ఉంగరాల వెంట్రుకలు కలిగి ఉందురు. వీరిలో పశ్చిమప్రాంత మున నుండువారు మాత్రము వికారముగా నుందురు.

బ్రిటిషు అధికారము నున్న ద్వీపాలలో "ఫిజీ" ప్రసిద్ధ మైనది. "ఫిజి" స్వర్గమని చెప్పదగినది. ఇచ్చటి జనులు పొడుగుగానుండు దృఢకాయులు శ్యామలవర్ణులు

పూర్వకాలమున వీరు మానవులనుచంపి పచ్చిమాంసము తిను క్రూరులుగా నుండిరి మానవులను బలియిచ్చుట వీరికి మిక్కిలి సామాన్యమైనపని. మానవుని హింసించి చంపుట పౌరుషమునకు లక్షణమనియు, మానవ మాంసము భుజించిన ధైర్యసాహసాది సద్గుణములు అలవడుననియు వీరిలో నొక మూఢవిశ్వాసము ఉండెడిది ఈ నమ్మకమే వారిచేత చాల సారులు మానవులను చంపించినది ఈ బలి యొసంగుటవలన వారు తమకు సకల సంపదలు, సమస్త భాగ్యములు చేకూరు నని నమ్మియుండిరి ఒక ముఖ్యనాయకుడు మరణించినప్పుడు ఆతని సేవకులు బానిసలను బలవంతముగా చంపి ఆతని వెంట పంపెడివారు. రాజశవము ఒంటరిగా పోదని వారు తలంచిరి.

ఫాదరీ మహాశయుల ప్రవేశముతో అచ్చట ఈ క్రూర కృత్యములు క్రమక్రమముగా అంతరించినవి. ఇప్పటి ఫిజియన్ నవనాగరికుడు, శాంతిప్రియుడు, మృదుస్వభావుడు. ఆతని పిల్లలు పాఠశాలలకేగి విద్యాభ్యాసము గావింతురు. ఈ పసిఫిక్ ప్రాంతమున పరిస్థితులు మారినంత తొందరగా ప్రపంచమున మరెచ్చటను మారలేదు. ఫాదరీల ప్రచారము, ఉత్సాహము ఇందుకు కారణమని చెప్పవచ్చును. ప్రచార మొనరించు నప్పుడు ఫాదరీ లనేకులు అచ్చటివారిచే చంపబడి యుండిరి. టాంగులలో క్రిష్టియన్ మత ప్రభావము ఎక్కువగా గోచరించును. ఇచ్చటి జనులు పౌరుషము మోమున ప్రతిబింబించు దృఢకాయులగు సుందరాకారులు. వీరి దేహవర్ణము రాగి రేకును బోలినది. వీరివి యుంగరాల వెంట్రుకలు. ముష్టియుద్ధము కుస్తీపట్లు మున్నగు వీరోచిత క్రీడలయందు వీరి కభిరుచి. టాంగుల ఉత్తరమునున్న సామోన్ ద్వీపములలో ప్రజలు యింతకన్నను యెక్కువ ఆకర్షణీయముగా నుందురు. వారు అతిథి సత్కారాదులయందు ఆదరము గలిగిన సుస్వభావులు. మధుర ప్రియవర్తనులు. వారి నైతిక ప్రవర్తన ప్రసిద్ధమైనది. దోపిడీలు పూర్వకాలమునందు వీరు కలలోనైన చేసియుండని నేరములు. సుప్రసిద్ధ ఆంగ్లగ్రంథకర్తయగు స్టీవెన్సన్ యీ ద్వీపమున చిరకాలము కాపురముండెను. ఆయన ఇచ్చటి జనులను పెద్దమనుష్యులు, సత్ప్రవర్తన గలిగిన సుశీలురు, ప్రేమింపదగినవారు అని ప్రశంసించియున్నారు. ఆయన మరణించినప్పుడు యీ ద్వీపవాసులు మిక్కిలి విచారించిరి.

సమోవా ద్వీపము ఫిజీకన్నను మనోహరమగు ప్రదేశమని ప్రసిద్ధి. ఇచ్చటి ప్రజలు ఉన్నతాకారులు, బలిష్ఠులు, శ్యామలవర్ణులు, కుటిలకుంతలులు. రోగముల వ్యాప్తివలన వీరి సంఖ్య తగ్గుచున్నది. ఈ ద్వీపము ప్రకృతి రామణీయకమునకు పుట్టినిల్లు. వృక్షసంపద చాలకలదు. వీరిది హాస్యప్రకృతి. నృత్యగానములు వీరికి మిక్కిలి ప్రియమైనవి. పండుగ పొద్దులందు జనులు గుమిగూడి నృత్యగాన వినోదములతో కాలక్షేపములు చేసెదరు. వాయిద్యమునందు వీరికి ప్రీతిహెచ్చు.

ఇంకను పడమటకు పోయినచో 'పాన్ మోటా'మున్నగు ద్వీపములు కలవు. వీటిసంఖ్య సుమారు ఎనుబదివరకుండును. ఇవి యందమైన ప్రదేశములు కావు; ఎత్తయినవియును గావు. ఈ ద్వీపములు కొన్ని కోడి గ్రుడువలెను, కొన్ని గుఱ్ఱపు నాడమువలెను ఉండును. వీనియందు తాడిచెట్లు పుష్కలముగా నుండును. వీనిలో సగముకన్న యెక్కువ ద్వీపములు జనులు నివసించునవిగావు. వీనిలో ఎక్కువ విశాలమైన ద్వీపములందు ఫలవృక్షములు, ముఖ్యముగా కొబ్బరిచెట్లు, బనానావృక్షములు మిక్కిలిగా నున్నవి. ఇచ్చట కొబ్బరి కుడుకలు విశేషముగా లభించును. ఎందరో వణిజులు కుడుకల వ్యాపారముకొరకిచ్చటికి వలస వచ్చియున్నారు. ఈ కుడుకలను నాశనముచేయు పురుగు కలదు. అది సుమారు రెండుగజముల పొడుగును అరగజము వెడల్పును కలిగియుండును. ఇది యొక్కసారి పది కుడుకలను నాశనము చేయగలిగినంత బలము గలది. ఇది వృక్షములను సులభముగా ఎక్కును. దీనిని చంపు పద్ధతి మిక్కిలి నిపుణవంతమైనది. మట్టితోను ఆకులతోను చేయబడిన ఒక చట్టి

మును తయారు చేసి, దానిని వృక్షమునకు మధ్యభాగమున అమర్చెదరు. ఈ పురుగు వృక్షమునుండి దిగునప్పుడు ఈ చట్టమునే భూమిగా భ్రమించి, తన పట్టును వదలి క్రిందపడి చచ్చిపోవును.

ఈ ప్రదేశము అందమైనదయ్యును ఇచ్చటి జీవితము ఆనందమయముకాదు. కొబ్బరి కుడుకలను సంగ్రహించుట, ముత్యపు చిప్పలకై సముద్రమున ఈదుట మున్నగు వృత్తులు వీరికి జీవనోపాధిని సమకూర్చును. ముత్యపు చిప్పలలో ముత్యాలు లేకున్నను, ఆచిప్పలు ఇతరవిధములుగా ఉపయోగకరమైనవి గావున, వాని వ్యాపారము లాభప్రదమైనదిగా నుండెను. వీరు పరిపూర్ణప్రజ్ఞకలిగిన గజ యీతకాండ్రు, శాంత ప్రవృత్తి కలవారు; సంభాషణయందు చతురులు హాస్యప్రకృతి కాదు; గంభీర స్వభావులు కొబ్బరి కుడుకలు, చేపలు వీరికి ముఖ్యమగు ఆహారము. ఇచ్చట తుపానులు అధికముగా వచ్చుచుండును.

తుపానులవలన ప్రజలు నశించుటయు, ఇండ్లు, సామానులు నాశనమగుటయు జరుగుచుండును. పొలినీసి యాలో మరికొన్ని ద్వీపములు కలవు. ఇవి కుసుమఫల భరితమగు వృక్షములతో శోభించుచుండును. కేసి అనునది ఇచ్చటి వృక్షములలో ప్రత్యేకముగా పేర్కొనదగినది. ఇదియొక పొద. దీని పుష్పములు పసుపు పచ్చగా నుండును. సంవత్సరమంతయు ఇది కుసుమించుచునేయుండును. దీని సువాసన సముద్రమున చాలా దూరము వ్యాపించి, పడవలు తీరము చేరక ముందుగనే, అందున్న జనులకు కమ్మనితావులతో సుస్వాగత మొసగు

చుండును. పసిఫిక్ ప్రాంతములందలి కళలు ఈ ద్వీపము పరిపూర్ణతను గాంచినవి. ఈ కళలను బోధించువారికి సంఘమున నొక యున్నతస్థానము కలదు రాజుతరువాత వీరే యెన్నదగినవారు. పర్వదినములందు ఇచ్చట అనేక వినోదములు జరుగును దూరప్రదేశములనుండి ఈ వినోదములందు పాల్గొనుటకు అనేకులు వచ్చెడివారు ఆ సమయములందు వారు తమ శరీరములను అలంకరించుకొనుటయో లేక యిదివరకే అలంకరించుకొనిన శరీరములను తీర్చి దిద్ది మెరుగులు కలిగించుకొనుటయో జరుగుచుండెడిది. ముప్పదియేండ్ల వయస్సు వచ్చువరకు ఈపద్ధతి సాగుచునే యుండెడిది. కాని ఫ్రెంచివారు ఈ యాచారములను నిలిపివేసినారు.

ఈ ద్వీపములలో "టాపు" సాంప్రదాయము కలదు. అనగా నిషేధము. స్త్రీలు ఎఱ్ఱని, నల్లని, ఊదా వస్త్రములు ధరించుట, యింటిలో చుట్టలు, బీడీలు త్రాగుట, నెత్తిమీద పెట్టుకొని చాపలు తీసికొనిపోవుటలను, ఈ సాంప్రదాయము నిషేధించెడిది. స్త్రీ పురుషులు కలిసి భుజింపరాదనునది మరి యొకటి. కొన్ని జంతువులను చంపరాదు. భుజింపరాదు. ఈ సాంప్రదాయములను మిక్కిలి పవిత్రములుగా భావించెడివారు. సాధారణముగా వీనిని యెవ్వరును, ఉల్లంఘింపకుండెడివారు. ఇప్పుడు యివి యంతరించినవి. స్త్రీలు పంది మాంసము భుజించుచున్నారు.

"గయానా-పాలోనెమ్" ద్వీపముల జనులు మిక్కిలి నల్లగా నుందురు. వీరు తమ గృహములను భూమిమీద మిక్కిలి ఎత్తుగా కట్టుకొందురు. విషపుజంతువులు, శత్రువులు

మున్నగు వారి బాధలనుండి తప్పించుకొనుట ఇందలి యుద్దేశము. కొన్ని గృహములు మిక్కిలి పెద్దవిగానుండును. అనేక కుటుంబములు నివసించుచుండును కొన్నిగృహములు క్లబ్బుల కొరకుపయోగింతురు ఇందు సభలు సమావేశములు జరుగును. నూతనాగంతకులకు దీనియందు వసతి కల్పించబడును

ప్రజలు మిక్కిలి తక్కువగా బట్టలు కట్టుకొందురు. అనగా వీరి దేహములు సంపూర్ణముగా ఆఛ్ఛాదితములుకావు. కాని వీరికి ఆభరణములయందు ప్రీతియెక్కువ. నృత్యమునందు మితిమీరిన ప్రేమ. నృత్యమే వృత్తిగా గలిగినవారు యీ ద్వీపము నందంతటను సంచారము చేయుచుందురు.

"మలయాటా" ద్వీపములో నివసించువారు మృగప్రాయులుగా నున్నారు. వీరిలో కొందరు తమ యిరుగు పొరుగువారిపైన సముద్ర యుద్ధము జరుపుచుందురు. మానవులను చంపుట వీరికొక క్రీడ.

---

# టిబెట్ లోని ఆదిమ నివాసులు

టిబెట్ రాజధాని లాసా, 1904 లో గ్రేటు బ్రిటన్ ఇచటికొక పరిశోధకబృందమును పంపియుండెను. అంతకుముందు ఇచ్చటికి ఇద్దరు ముగ్గురుకన్న యెక్కువ తెల్లవారు వచ్చియుండరు. ఇప్పటికిని యీ దేశమునకు వెళ్ళిచూచిన తెల్లవారి సంఖ్య మిక్కిలి స్వల్పము. హిమాలయ పర్వతములు

యీ టిబెట్ దేశమును ప్రపంచమునుండి వేరుపరచుచున్నవి హిమాలయ పర్వతములందలి జెపాలె లోయనుండి టిబెట్ దేశములో ప్రవేశింపవలసి యుండును. దేశమునకు రాజు డలైలామా. ప్రజలీతని విష్ణుస్వరూపునిగా భావింతురు ఈ దేశమున బౌద్ధ పరివ్రాజకులకు చాలా పలుకుబడి కలదు. ఒకవిధముగా వారు తమ విహారములందుండి దేశమును పాలించుచుందురు. ఈ దేశమున ఫ్యాక్టరీలు యంత్రశాలలు ప్రార్థనకు సంబంధించినవి మాత్రమే. అవితప్ప ఇచ్చట మరెట్టి యంత్రశాలలు లేవు ఈ దేశమున బౌద్ధ భిక్షువులు యంత్రములచే ప్రార్థన చేయించుట యను విచిత్రమగు పద్ధతి ప్రవేశపెట్టినారు. అందుకొరకు వీరు ప్రత్యేకమగు యంత్రములను నిర్మించినారు "ఓం మణి పద్మే ఓం" అను బౌద్ధ ప్రార్థన ఈ యంత్రములయొక్క చక్రములమీద కాగితములపై వ్రాసి అంటింపబడియుండును. ఈ చక్రములు గాలిచేతనో లేక నీరు చేతనో తిరుగునవిగా నుండును ఈ చక్రములు ఎన్నిమారులు తిరుగునో అన్నిమార్లులు ప్రార్థన జరిగినట్లు వీరు భావించెదరు సాధారణముగా ప్రతివానిచేతిలో ఈ ప్రార్థనా చక్రములు కానబడును. ఇదిగాక మరియొకపద్ధతి ఇరువదినుండి ముప్పది యడుగులు పొడుగుగల కట్టెలను భూమిమీద నెలకొల్పెదరు. వీని చివరకు మసిగుడ్డలు మొలలచే కొట్టబడియుండును. ఆ గుడ్డలపైన ప్రార్థన వ్రాయబడి యుండును. గాలిలో నీ గుడ్డలు ఎన్నిమారులు పరిభ్రమించునో అన్నిమారులు ప్రార్థన జరిగినట్లు భావింపబడును. బౌద్ధ భిక్షువుల సమాధుల పైన శిలలను నెలకొల్పి వానిమీద ఈ ప్రార్థన వ్రాయబడి

యుండును ఇట్టివి టిబెట్‌నందు ఎక్కడ చూచిన కనిపించు చుండును

ఈ దేశమునందు యాటంగ్‌లోయ మిక్కిలి సుందర మైనది అల్ప్సు పర్వతప్రాంతమునందలి ప్రకృతి గంభీర దృశ్యములకన్న, ఇచ్చటి దృశ్యములు మిక్కిలి రమణీయమైనవి. ఇచ్చట భూమియంతయు పూలచే అందముగా కప్పబడి యుండును పర్వత శ్రేణులయందు వృక్షములు ఈ చిత్రవిచిత్రములగు పుష్పములచే విరాజిల్లు చుండును. టిబెట్ దేశమునందలి సగము జనసంఖ్య వాణిజ్యము వృత్తిగా కలిగి యున్నారు ఈ వంశజులలో అధిక సంఖ్యాకులు పుసంగు మరియు దాని యుపనదులు ప్రవహించు భాగములందు నివసించుచున్నారు. అస్సాము దేశమున ప్రవహించు బ్రహ్మపుత్రానదియొక్క తొలుట్టువు (యొక్క భాగమే) ఈసాపోనది. టిబెట్ దేశము మిక్కిలి పెద్దది ఫ్రాన్సు, జర్మన్, ఇటలీ మూడింటి మొత్తము వైశాల్యము కన్నను టిబెట్ యెక్కువ విశాలమైనది. ఇచ్చట నివసించు ప్రజలును వివిధ విధములుగా నున్నారు పట్టణములలో నివసించు జనులకును పల్లెలలో నివసించు జనులకును గొప్ప తారతమ్యముగలదు ఇండియా ప్రక్కనున్న ప్రాంతమునందలి జనులకును, చైనాకు సమీపమున నున్న ప్రాంతమునందలి జనులకును పెక్కు విభేదములు గలవు. అయినను యీ వైవిధ్యమునందు సామ్యముకూడ చాల కలదు.

టిబెట్ దేశవాసులందరిది ఒకేమతము. వారు బౌద్ధులు; టిబెట్ దేశమునందెచ్చట జూచినను బౌద్ధవిహారములే కాను

పించును ప్రతికుటుంబమున కనీసము ఒకడైన పరివ్రాజకుడై యుండును చుట్టును పర్వతపంక్తులుండుటచే కాబోలు వారు ఏకాంతవాసము నిచ్ఛగింతురు. అన్యదేశీయులతో కలిసిమెలసి యుండు స్వభావము వారిదికాదు. అన్యదేశీయులు తమ దేశమున క్రొత్త యాచారములు ప్రవేశపెటుదురేమో యను భయము వారికి కలదు. వ్యవసాయ మొనరించి, మిక్కిలి స్వల్పముగా వ్యాపారము చేయుటతో వారు సంతృప్తి నందుదురు. ఇతరదేశముల కేగవలెననికాని, గొప్ప పరిశ్రమాగారములు స్థాపించవలెనని కాని వారు ఆశించరు.

టిబెట్ దేశీయులు మేధాశాలురుకారు. చైనా దేశీయుల వలె సంస్కారము కలిగినవారును కారు. వీరి సంస్కృతికి చైనాదేశపు సంస్కృతియే ఆధారము. వీరవలంబించు మతము భారతదేశమునుండి, చైనాదేశముద్వారా దిగుమతియైనది. కాని చైనాదేశీయుల సంస్కారము మాత్రము వీరి కలవడ లేదు. వినయము, సభ్యత మున్నగు చైనాదేశీయుల సద్గుణములు వీరి కలవడినవి. అతిధిసత్కారమునందు వీరిది పెట్టినదిపేరు.

టిబెట్‌నందు తేనీరు ఎక్కువగా స్వీకరించు పానీయము. వీరు తేయాకు చైనానుండి తెప్పించుకొందురు. తేయాకుతో వెన్న, ఉప్పు కలిపి తేనీరు తయారుచేయుదురు. అతిథులతో గృహములో ఒక చిన్న బల్లముందు కూర్చొని చైనా కప్పులలో తేనీరు గ్రోలుచు సంతోషముగా హాస్యవచనములతో ప్రసంగింతురు.

ఈ టిబెట్ దేశపు సంఘమునందు, కడతరగతి వారిలో నొక వింతయాచారము కలదు. నాలుకను వెళ్ళబెట్టుట,

వీరిలో నమస్కారమునకు చిహ్నము. మోకాళ్ళమీద వంగి, కుడిచెక్కిలియందు కుడిచేయినుంచి నాలుకను బైటపెట్టుదురు.

నృత్యములందు టిబెట్ దేశీయుల కభిమానము. నృత్య మొనరించు సమయమున, సంగీతము, పానీయముతో వారు తమకాలమును సంతోషముగా గడిపెదరు. ఈ నృత్యములలో ముఖ్యమయినది పిశాచ నృత్యము. ఈ నృత్యమునందు పురోహితులు రంగు రంగుల బట్టలను ధరించి రాక్షసుల శిరముల ననుకరించు ముసుగులుపెట్టుకొని, డప్పులతోను, ఫ్లూటు తోడను తేనీరు గ్రోలుచు నృత్యమొనరింతురు. నీతివిరుద్ధముగా ప్రవర్తించినచో చెడిపోవుదురను సందేశ మీ నృత్యము ప్రజల కొసంగును. ఈ నృత్యములు పురుషులే చేయుదురు. స్త్రీలు పాల్గొనరు. అయినను టిబెట్ దేశీయుల జీవితమున స్త్రీల కొక ముఖ్యస్థానము కలదు. వారికి మహమ్మదీయుల వలె పరదాలేదు. స్వేచ్ఛగా బాజారులకుపోయి, వ్యాపారము మున్నగు వానియందు నిరాటంకముగా పాల్గొనెదరు. మ్యాహోగనీ కలర్ లను రంగును యీ స్త్రీలు మొగమునకు పూసికొని, తమ సౌందర్యమును దాచుకొందురు. సుందరాంగుల సహజ లావణ్యమును తగ్గించుటకొరకై మూడు వందల సంవత్సరముల క్రింద గావింపబడిన యొక వింతశాసనమే యిందుకు కారణము.

టిబెట్ నందు ఒక స్త్రీకి యిద్దరు ముగ్గురు భర్త లుండ వచ్చును. ఇది యెంతమాత్రము న్యాయ విరుద్ధము కాదు. సాధారణముగా యిద్దరు ముగ్గురు సోదరులు ఒక భార్యతో కాపురముచేయు నిదర్శనములు కలవు. భర్త యనుమతితో

భార్య మగనితోపాటు మరియొక్కరికి గృహిణియగుట కలదు. ఒక కుటుంబమునందు గృహ యజమానురాలు చనిపోయి నప్పుడు ఆ గృహస్థుడు మరల పెండ్లాడినచో ఆమె కుటుంబము నందున్న వారలందరికిని భార్య యగుచున్నది. సోదరీ సోదరుల వివాహము శాసనవిరుద్ధము. టిబెట్‌లో భార్యకు భర్తమీాద గల యధికారము ఆశ్చర్యకరమైనది. భర్తలు సంపాదించిన ధనమంతయు భార్యచేతిలో పెట్టవలయును. తన కేమైన ధనము కావలసినచో భార్య నడుగవలెను. తన భర్తలలో ఏ యొకరైనను ఆర్జించి ధనము తన కొసంగకపోయినచో, భార్య అతనిని ముష్టి ప్రహారము చేయుటకు వెనుదీయదు. ఇతర భర్తలతోకూడ అతనికి యీా ప్రహారములు తప్పవు. పరస్పర వైమనస్యము తటస్థించు నప్పుడు విడాకు లొసంగుట జరుగుచుండును. భారతదేశము నందువలెగాక, టిబెట్‌నందు ఇరువది ఇరువదియైదు సంవత్సరములమధ్య వివాహము జరుగును. కావున సంతానము మిక్కిలి బలిష్ఠమై యుండును. ముగ్గురు నల్గురు భర్తలొకేభార్యను కలిగి యున్నప్పుడు అందులో పెద్దవాడు సంతానమునకు తండ్రిగను, ఇతరులు పిన తండ్రులుగను భావింపబడుదురు. కన్యకు స్వయంవరార్హత లేదు. తల్లిదండ్రులు విధించిన వానినే పెండ్లాడవలెను. కావుననే యీా నిర్బంధ వివాహములు సాధారణముగా విడాకులతో అంతరించును. వివాహము జరుగు దినమువరకు వధూవరులకు ఆ వివాహమును గురించి యేమాత్రము తెలియదు. కన్యాశుల్క, వరశుల్కములు లేవు. వివాహ దినమున తలిదండ్రులు పుత్రికతో "నేడు దేవాలయమున కరుగవలసియున్నది.

కావున అలంకరించుకొనవలె''నని మాత్రము చెప్పుదురు. ఆమె యలంకారము పూర్తియైన తరువాత, కాబోవు వివాహ విషయములు తెలిపెదరు. వివాహ సమయమునందు బంధువులు మిత్రులు కట్నము లొసంగుట కలదు. వివాహ సమయమున విందారగించునప్పుడు నృత్యగాన వినోదములు జరుగును. వివాహ దినమున వరుని తల్లిదండ్రులు ప్రతినిధులను వధువు గృహమునకు కొంతధనముతో పంపుదురు ఈ ధనముతో ఆమె తనకు కలుగబోవు బిడ్డలను పోషించవలెను అప్పుడు యీ ప్రతినిధులు, బట్టలు, మొలనూలు, చైనా పాదరక్షలు మరియు ఇతరములు వధువుకొసంగుదురు. సాధారణముగా నొక యమూల్యరత్నమును నుదుటిపై యలంకరించుకొను నిమిత్తము ఒసంగుట కలదు. వధువు తల్లిదండ్రులుగూడ ఆమెకు అమూల్యమగు భూషణములు, ఆభరణము లర్పించుట కలదు. చెవుల పోగులు, ఉంగరములు, దండకడియములు, రత్నహారములు మున్నగునవి ఇందులో చేరియుండును

వివాహ సమయమున పురోహితుడు కొన్ని సూక్తుల ననుసరించి వధువుకు తగురీతి యుపదేశ మొసరించును. ఆమె దయతో నుండవలయును. పెద్దలయెడ భక్తికలిగి, భర్తయందు మరదులయందుదయతో ప్రవర్తింపవలెను. సేవకులను తనపిల్లలుగా భావింపవలెను, అనునవి కొన్ని సూక్తులు. తలిదండ్రులు యిదేరీతిగా బిడ్డలకు ఉపదేశ మొసరించి కన్నీళ్ళతో అప్పగింతురు.

వధువు మాతృగృహమును విడుచునప్పుడు పట్టలేక విలపించుట కలదు. పోలేక పోలేక ఆమె యత్తవారింటి

కేగును. ఆమె యత్తవారింటికి వచ్చునప్పుడు ద్వారము బంధింపవలసియుండును. అప్పుడు మంత్ర తంత్రములయందు ప్రవీణు డొకడు వచ్చి పిశాచములను పారదోలిన పిదప ద్వారము తెరువబడి, ఆమెకు ఇంటిలో ప్రవేశము కలుగును.

( 1947 లో ప్రకటితమైన యీ వ్యాసాలు గోలకొండ పత్రిక సౌజన్యముతో పునర్ముద్రితములు. )

# గ్రంథకర్తగారి ఇతర గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| 1. | నవ్యకవితా నీరాజనము | | ప్రతులు లేవు |
| 2. | పచ్చతోరణము (ఖండకావ్య సంపుటి) | | ,, |
| 3. | నవనీతము (సారస్వత వ్యాసములు) | | ,, |
| 4. | విశాలాంధ్రరాష్ట్రము | | ,, |
| 5. | సారస్వత నవనీతము | | కొద్దిప్రతులే కలవు. |
| 6. | తెలుగు సీమలో సాంస్కృతిక పునరుజ్జీవనము | | ,, |
| 7. | మన దేశము | (పిల్లలకొరకు) | ,, |
| 8. | తెలుగు దేశము | ,, | ,, |
| 9. | జవహర్ లాల్ నెహ్రూ | ,, | ,, |
| 10. | గౌతమ బుద్ధుడు | ,, | ,, |
| 11. | హైదరాబాదులో స్వాతంత్ర్యోద్యమము | | ,, |
| 12. | ఆదిమ నివాసులు | | |
| 13. | విశాలాంధ్ర వచ్చింది | | |
| 14. | వ్యాస మంజూష | | (అచ్చులోనున్నది) |

---

ప్రతులకొరకు :

గ్రంథకర్త,

C/o ఆంధ్ర సారస్వత పరిషత్తు

బొగ్గులకుంట, హైదరాబాదు — ద.